# బ్రహ్మవిద్యావిలాసము



బ్రహ్మర్షి

డా॥ ఉమర్‌ఆలీషా కవి కృతములు



శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

పిఠాపురం



మూల్యము : 45 రూపాయలు

శ్రీమదా ఖైలలీషా గురుభ్యోన్నమః
బ్రహ్మవిద్యా విలాసాంద్ర

# పీఠిక

విషయేంద్రియ గుణషడ్వర్గాది వాంఛావివాదాలంకారుండైన మానవుండు నిజపరిజ్ఞాన శూన్యుండై స్వపర తారతమ్యంబులేక, మాయా నిబిడాంధకార వికీర్ణకల్లోల మాలాకులాఖిలుండై శోకవ్యాకుల తమః పరికల్పిత శరీరముఖుర ప్రభిన్నఖిన్న మనస్కుండై చెడి నడియాడు మూఢుండగు నిర్గతకర్మంబైన స్వర్గాపవర్గమార్గంబు దుర్గమంబు అవ్యక్తాసక్తుండుగాక సంసార సాగరనిగ్నోత్తారకంబైన తత్వజ్ఞానంబనుభవరీత్యా వడిసిన మహనీయునకు జహదర్జహర్లక్ష్యంబులచే తత్వం అసిపదంబుల వాచ్యార్ధ లక్ష్యార్ధంబుల బాధ్యంబుగా బోధించు విధంబొక్కటియేయైనను, లోకాయతమనో హైరణ్యా గర్భబౌద్ధ వైదిక యోగాంతరాళ ప్రాజాపత్య గాణాపత్యతార్కికాద్యనేక తార్కిక మతస్థులు తమబుద్ధికిదోచు తెరంగు లెరింగింపుచు ప్రకారాంత శబ్ధప్రయోగంబులచే శృత్యర్ధంబులు నర్ధాంతరంబులుగా మనోరధంబు గమనించి నిశ్చయపర్చి స్వాతిశయ స్వగౌరవంబులు చెడకుండా వాదించుచుండునట్టి విపరీత జ్ఞానంబునం బ్రవేశింపక దక్కెనేని దక్కిన ద్వైతాద్వైత విశిష్టంబులం బడిచెడు వాసీకూపతటాక ఘటాంత దృశ్యంబైన సూర్యునిపగిది నఖిలవస్తు నియామకుండైన నీశ్వరుండు నిర్హేతుక జాయమాన కటాక్షంబున ప్రపంచంబు ఘన ఘనాంతర విద్యుల్లేఖవలె తనయందు దోపించి తానుదోచక పరోక్షుండై యుండు నయ్యీశ్వరుండు, శృతి: స దేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం అను ప్రమాణముచే సృష్టిగాకమున్ను జగత్తు నామరూప క్రియా శూన్యంబైన శక్తియైయుండి ॥శృతి॥ ఐతదాత్మ్యమిదం సర్వం సత్సత్యంప ఆత్మా॥ ఆపత్తునుండి యీగనుపించు జగత్తున్ను, అదే సత్యమున్ను ఆత్మయున్నుయై నాయాత్మకుమున్ను యుపాదానకారణమైన మాయ యావిర్భవించినది. శృతి॥ మాయాంతుం ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం। అస్యావయవ భూతైస్తు వాప్తంసర్వం మిదం జగద్॥ అను శృత్యర్ధంబునంబట్టి, మాయ, ప్రకృతి, యవిద్య, యీశ్వరులు

యయ్యె, నందుమాయ ॥శృతి॥ మాయాచతమోరూప। తదేతజ్జడం మోహాత్మకం అనంతం ॥అనగా॥ మాయ మాలిన్యమైనదియు, జడస్వరూపమైనదియు, మోహనస్వరూపమైనదియు, జడస్వరూపమైనదియు, మోహనస్వరూపమైనదియు అంతటానిండినదై నను॥ విద్యచేపలాయిత మగుచున్నప్పుడు విశ్వాసార్థముగాదు ॥శృ॥నాసదాసీత్॥ అనగా బ్రహ్మమువలె శూన్య సద్రూపమ్ములుగాకపోయినను ॥శృ॥ నేహనానాస్తి కించన॥ అనెడి శృతిచే మాయనిషేధమగును ॥శృ॥ అయుక్త। మనెడు శృతిచే నిరాదరణీయమయినది। నిర్వచనీయమైనదియును నగును॥శృ॥ తుచ్ఛమిదంరూపస్య॥ అని చెప్పియున్నది. గావున మాయిూజ్ఞానముచే తుచ్ఛమైనదియు, యుక్తిచే యచింత్యమైనదియు లోకదృష్టిచే వాస్తవమనియు త్రివిధంబైయున్నది. మాయాసంబంధీకుండైన నీశ్వరుండును నట్టివాడే. నింక నాత్మ విషైక భ్రాంతులనేకంబులుండు నిట్టిదట్టిదనెడి స్వరూప సూన్యంబెన దెట్టిదియో నట్టిస్వరూపంబే యాత్మ॥ ప్రసన్న పదార్థంబు లిట్టివనియు యింద్రియంబులకు పరోక్షంబులై తద్వస్తుధర్మంబులకు శబ్దస్పర్శాదులట్టివని చెప్పంబడును. ద్రష్టయైన యాత్మయో॥ యింద్రియంబులకు విషయుడు గానందున, యెట్టివాడనియును చెప్పంబడదు॥ యిట్లు శృతి॥ యేనేదంసర్వం విజా నాతితంకేన విజానీయా ద్విజ్ఞా తారమరేకేన విజానీయాత్॥ సవేతి వేద్యం నచత స్యాస్తి వేత్తా॥ నైవవాచానమనసా॥ ఇత్యాదిశృతులు చెప్పుచున్నవి. అనుభవ స్వరూపుండైన యాత్మ కింకొక టెరుంగు వస్తువున్నదన్న అనవస్థా దోషంబుగలుంగు. ॥శృ॥ ఏకోదేవస్సర్వ భూతేషుగూడః॥ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్ష స్సర్వభూతాదివాసాస్సాక్షీ చేతాకేవలో నిర్గుణశ్చ॥ అనగా ఒక్కటైన యాత్మ చైతన్య మాత్రుండై ప్రకాశించును॥ నిట్లు ధ్యాన ప్రమాణ యుక్తి సాధనంబులచే సద్వస్తువాకాశమాయాశక్తులు, జగజ్జీవేశ్వరులు, శూన్యసద్రూపములు జాతివెక్తులు, క్రమంబుగ సత్య మిథ్యా రూపభేదబుద్ధులచే నెరింగి తన్ను పత్యగభిన్న పరమాత్మ స్వరూపంబుగా నెరింగి, వేరొండు దలంపక ॥శృ॥ తదేత్సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవాత్ర హ్యేవం, నవిచికిత్స్య మిత్యోంసత్య మాత్మైవ నృశింహోదేవోబ్రహ్మా భవతి, అహం బ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, తత్వ మసి, సవాఏష మహానజ ఆత్మాஉ జరోஉ మరోஉ మృతోஉ భయోబ్రహ్మనేతినేత్యాత్మ యిత్యా దనంత శృతులను ॥శ్లో॥ క్షేత్ర

# బ్రహ్మవిద్యావిలాసము

జంచాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత యేనభూతాన్య శేషేణ ద్రక్ష స్యాత్మన్యధోమయి॥ అని గీతావాక్యములున్ను, స్వానుభవుంబైన యాత్మయే బ్రహ్మమని ఘోషించుచున్నవి ।శృ। తమేవభాం తమను భాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి॥ అను శృత్యర్ధ ప్రమాణమునుబట్టి యాత్మకున్ను బ్రహ్మముకున్ను శబ్దమాత్ర భేదంబుగాని నిజమైన భేదం బొకింతయులేదు. ఇది గ్రహించినవాడే మహాజ్ఞాని. వాడే మునీశ్వరుడు. వాడే జీవన్ముక్తుడు.

మ. వరకళ్యాణ గుణుండు శ్రీ మోహియద్దీ౯ భాష్యాగురుండాత్మవి
దృరహస్యేశ్వర జీవభావవిదు దధ్యాత్మైక యోగప్రభా
కరుకల్లోల వికీర్ణ ఘోరగుణ సంఘాతోరు సంసారసా
గరసంచార విదూరుడాతనికి సత్కళ్యాణి చాన్బీమహా
వరలక్ష్మీతనయుండ వుంరె యలిషానామంబందు వర్తించెద౯.

ఉ. బాల్యమునందు షోడదశ వత్సరప్రాయమునందు నన్ను సౌ
శీలము నొప్ప పండితులు జీవుని కీశ్వరవృత్తి గల్గ సా
కల్యముగాను దెల్పుశత కంబురచింపు మటన్న బుద్ధిచా
పల్యతచేత తక్షణము వ్రాసితి తప్పుగణింప కింతయు౯

కం. శృత్యర్ధవ్యతిరిక్తము
లత్యంతర్థాంతర ప్రకారాంతరనౌ
ద్ధత్యపదంబులు జేర్పక
సత్యము వ్రాసితిని నిందు శమదమ మలర౯.

ఇట్లు

విధేయుడు

**ఉమర్ఆలీషా.**

# పీఠాధిపతుల చరిత్ర

శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠమునకు పీఠాధిపతులలో ఆది పీఠాధిపతి 1472 సం॥లో భారతదేశమునకు వచ్చియున్నారు.

ఆదిలో ఈ పీఠము అరబ్బుదేశమున అందలి బాగ్దాదునుండి పారశీకదేశము, అక్కడనుండి భారతదేశమునకు వచ్చి ఢిల్లీ నగరమున నివసించి అక్కడ సర్మద్‌హుస్సేనీ (సర్మద్ షహీద్) పేరుగల తత్త్వవేత్తను ఔరంగజేబు చంపించినప్పుడు వారి సమకాలికుడైన యీ పీఠాధిపతి తానేషా కాలమున హైదరాబాదు వచ్చి హైదరాబాదు నుండి యీ పీఠమునకు జాగీరొసంగిన కారణమున ఆంధ్రదేశము ప్రవేశించి పీఠికాపురమున నివాసముగా స్థిరపరచుకొన్న మొదటి పీఠాధిపతి మదీన్ కబీర్షా.

ఆ కాలమువారిచే యీ పీఠాధిపతి మదీనా నుండి వచ్చిన తత్త్వవేత్తయని పిలువబడినారు. ఈ పీఠాధిపతులు ఏ దేశములో నున్నప్పుడు ఆ దేశ భాషలలో, ఉత్కృష్టమైనదిన్నీ, గణనీయమైనదిన్నీ అయిన కవిత్వం చెప్పియున్నారు.

వీరు అరబ్బీ, పార్శీక భాషలలో తత్వము గూర్చి గ్రంధము వ్రాసినట్లు తెలియబడుచున్నది.

ఈ మదీన్ కబీర్షాగారిని తత్వ రూపులుగ గ్రహించుటకు ఆనాటి ప్రజలు వీరి మహత్మ్యము చూడగోరి బండ్లకొలది యిన్థనంబులు కాల్చి అగ్ని గుండము యేర్పరచి వారిని అందు కూర్చుండమని కోరగా అప్పుడు ఆ అగ్ని గుండమున పూలపాన్పున గూర్చున్నట్లు గూర్చుండి తన మానసిక మహత్మ్యము ప్రజలకు జూపిరని వారి చరిత్ర.

వారి తరువాత వారి అగ్రనందనుడు ద్వితీయ పీఠాధిపతి మధార్షా. ఆ తరువాత వారి సుతులు తృతీయ పీఠాధిపతి "హసన్మియాషా వారి కుమారులు చతుర్థ పీఠాధిపతి కహెనేషావలి." వీరి పిన్ననాటి కాలమున బాల్యమందే వీరి

తండ్రి హసన్మియాషా దివంగతులైన కారణమున వారికి తిరుగ ఆఖైలలీషా .గురువర్యులచేత యీ పీఠతత్వ స్వరూపమైన మహామంత్రము ప్రబోధింపబడి తిరుగ యీ పీఠము పునఃస్థాపితమైనది.

శ్రీ కాహెనేషావలీగారి చిన్ననాడు ఒకనాడు వారి దృశ్యములో నొక మహాపురుషుడు కనబడి దర్శనమిచ్చి మీ వంశమందు ఆధ్యాత్మికరూపమైన తత్వస్వరూపము పీఠాధిపత్యరూపంలో వెలార్చబడుచున్న విధానము మీకు ముందు మీ తండ్రిగారు పీఠాధిపతిగ నిర్వహించు కాలమున మీ బాల్యమునందే వారు నిర్వాణము పొందియుండుటచే, అది మృగ్యమౌ సమయము కలుగనున్నది, ఆ పీఠమునకు మీరు పీఠాధిపత్యాధికారము స్వీకరించవలసియున్నది. ఇప్పుడు నాచే మీకు యీ మహామంత్రము ప్రబోధింపబడి పునరుద్ధరణ కావలసియున్నది. కాబట్టి ఈ రహస్యము నాచేత తెలుపుకోవలసినదిగా చెప్పినట్లు, పైవిషయములు దృశ్యములో చెప్పిన విధానమున శ్రీ కాహెనేషావలీగారు బడికిపోవు సమయాన యే మహాపురుషుడు దృశ్యములో తనతో ప్రసంగించెనో ఆ మహావ్యక్తి జాగ్రదావస్థలో యెదుటపడి యేవాక్కులైతే దృశ్యములో ఆయన నోట ధ్వనింపబడినవో, నదేతీరున ఆయనచే ఈ పీఠాధిపతులచే ప్రబోధింపబడు మహామంత్రము ఆనాడు కాహెనేషావలీగారికి ప్రబోధింపబడినది. ఆయనే శ్రీ ఆఖైలలీషా గురువులు. వీరు ఆకల్పాంతము దాక యీ పీఠాధిపతులకు గురువుగ సంస్మరణీయులు.

ఆనాటి నుండి యీనాటివరకు యీ పీఠాధిపత్యము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వారి పీఠాధిపత్య కాలములో "కలికి భాగవతము" అనే గ్రంథము ఈశ్వర పరిణామము తెలుపు మహత్మ్యములతో నిండిన తత్వము చెప్పబడినది.

ఆ తరువాత వారి అగ్రనందనులైన పంచమ పీఠాధిపతి మహర్షి శ్రీ మొహియద్దీన్ బాద్షా గురువర్యులు, తన స్వానుభవైక వేద్యమైన కీర్తనలు, పదములు "పరతత్వ కీర్తనలు" అనుగ్రంథముగ రచింపబడినది.



# శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి
# జీవిత సంగ్రహము

శ్రీ ఉమర్ ఆలీషా మహాకవిగారు పీఠికాపురమున క్రీ.శ. 1885 వ సం॥లో జన్మించిరి. వీరి తండ్రిగారు మహర్షి మొహియద్దీన్ బాద్షా గురువర్యులు. వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు. ఆధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాపారంగతులు. వీరి కుటుంబము పూర్వము నుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతి గాంచినది. శ్రీ కవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి తదుపరి అరబ్బీ పారశీ కాంగ్ల భాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగుదురు కాని ఆంగ్ల పద్యకావ్యములందు నెంతమాత్రము వీరికి ప్రవేశము లేదు. వీరు సహజ కవులు. వీరి 14 వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వము జెప్పిరి. వీరి 18 వ యేట "మణిమాల" యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలె నున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరికనేకచోట్ల ఉద్యోగములిచ్చెదమని ఆహ్వానించినను వాటికంగీకరించక భాషాసేవ, దేశసేవజేయుచు తన జీవితమును గడిపిరి. వీరు 1934 వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆ పదవి వీరు అవతారము చాలించు వరకు నుండెను.

వీరికి International Academy of America వారు 1936 సంవత్సరమున Doctor of Literature బిరుద మొసగిరి. శ్రీ కవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగిక జ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుద మొసంగిరి. వీరి సతీమణి అగ్బరు బీబీగారు, వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35 తేదీని దివి నలంకరించిరి. ఆ దినమున ఢిల్లీ శాసన సభ మూయబడెను. వీరు గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమారులు, యిరువురు కుమార్తెలు, పెక్కురు పౌత్రపౌత్రిక లుండిరి.

శ్రీ కవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయబడుచున్నది. వీరు రచించిన "సూఫీ వేదాంత గ్రంధ"మందు వీరి జీవితము సంగ్రహముగా నిట్లు వ్రాసిరి.

--- స్వీయము ---

క. ఆ మొహియద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుడను నా
నా మహితాగమ హిత వి
ద్యామతి "ఉమ్రాలిషా" మహాకవి నేనున్

సీ. రచియించినాడ విభ్రాజిత దివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాడను కల్పనాసక్త మతి పది
నాటకంబులను కర్నాటపక్కి
కూర్చినాడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనగ
తెలిగించినాడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధాన క్రమములందు
ఆశువులయందు పాటలయందు కవిత
చెప్పినాడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమ్రాలిషాకవి" యనగ నేను.

ఉ. రాజుల జూచితిన్ సుకవిరాజుల నోర్చితి బేరు మ్రోయ రా
రాజుల నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవీబిరుద పట్టము లందితి యూనివర్శిటిన్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుడైతి గ్రమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వ రసైక చారు వి
న్యాసములున్ మతాంతర మహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాడను "ఉమ్రలిషా" కవీంద్రుడన్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారతోషికా
ద్యాళిని వేయినూట పదియార్లును సింహతలాటముల్ మహా
భీలక సత్కళా కనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వనీనటత్క కవి తండము లేమిటి లెక్కమాకడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ మెక్కి మతిని చక్కాడియాడి
బోధించితిని జ్ఞానసాధన క్రమములు
చెవినిల్లుగా జేసి చెప్పి చెప్పి
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపిమోపి

తే. ఇప్పుడప్పుడె నలువదియేండ్లపైన
దాటిపోయెను వయసు నీనాటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. నను నీజ్ఞానమహాసభాసదులు నానందన నర్థించి "ఆ
దిని మీపూర్వ పితామహుల్ గురువులై దివ్యత్వమేపారగా
ఘనవిజ్ఞానకళా ప్రవృష్టి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీ రాకృతి బోధసేయదగు "ఉమ్రాలీష" భాషాగతిన్,

మ. అని నెయ్యంబున గోరగావిని మహర్షంబు సంధిల్ల నౌ
నని యీ జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని సంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగ సేతునని నే నారంభమున్ జేసితిన్,

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వ పదంబు జేర నే
గోరగ జ్ఞాన సభ్యులు నకుంఠిత దీక్ష జగంబు మెచ్చగా
భూరితపస్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబు దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండు జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటమురాదు నుపన్యసించు నా
దినముల విద్యతో గలసి తృప్తి ఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లీ భారతశాసనైకసభ రూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్ జేరి మహత్తరోజ్జ్వల కళాధిక్యంబు రాజిల్ల వి
ద్వల్లోకంబున రాజకీయకలనా వ్యాపార పారంగతం
బెల్లన్ వేట్కను నిర్వహించుచును నేనీ గ్రంధమున్ వ్రాసితిన్

ఉ. ఏను హిమాలయంబుపయి కెక్కి తపస్వుల జూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగ గన్పడునట్లు దృశ్యంబు మార్చుచున్.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపగ రాని యీ యమరవిద్యాతత్త్వ మర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గ మే
మేలా దాచెద మంచు జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరగన్.

కం. మా తాతయు మా తండ్రియు
ఖ్యాతిని ఆఖైలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియన్.

ఉ. ఎల్లరు జెప్పుచుండిరల యీశ్వరుడీవని మీరుగూడ నా
కల్లలు బొల్లులల్లి కధగా నిటుకల్పనజేసి చెప్పగా
నొల్లునెయంచు మీరలన నోపుదురేమొ తదీయవాస్తవం
బల్ల రహస్యమున్ దెలిపి యద్భుతమార్గము విప్పి పెట్టితిన్.

మ. కనదుత్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబు గావించున
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్ర
హ్మనుగామార్చెడు త్రోవజూపితి నిధి ధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరిసంకాశంబు సంధిల్లెడున్.

ఉ. మేమురచించు గీతములు మృత్యువాయువు పథంబులందులో
నేమియు నర్థహాని కెడమియ్యక ఉన్నది యున్నట్లుగా
నేమహనీయుడున్ నడచి యీశ్వరరూప మెఱుంగ నేర్చునో
ఆ మహితాత్ముడొక్కడే యధార్ధ మిఱింగి మృతిన్ జయించెడున్.

శా. నాతోనున్న మహాకవీశ్వరుల నానాకావ్యముల్ వ్రాసినెం
తొ తత్త్వాత్మక దృక్ప్రపంచకము నుద్యోగించి చిత్రించుచున్
చైతన్యంబు గలుగంగజేసితి మహాసత్యస్వరూపంబుతో
జేతోవీధిని నీశ్వరుంగనెడు వైచిత్ర్యంబు జూపించితిన్.

ఉ. ఎవ్వరి నొవ్వనాడమిటు లెవ్వరినోరును కట్టివేయమే
మెవ్వరిదారి దూరిమరలింపము మాకడవచ్చు వారితో
నివ్వటిలంగ నీ తెలివునేర్పి తరించు మటంచు చెప్పి మా
దివ్వె వెలుంగ జేసెదము దివ్యులుగన్వడ బుద్ధిమాన్పడన్.

## అగ్బరాంబ

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపుడం
చాడన్ నేను కృతార్థుడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్బరాంబిక చలత్ విద్యుల్లతన్ బోలె యీ
నాడే నశ్రులు 'గోరి' పై విడుచుచు న్వర్తింతు నిర్జీవినై,

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిటినో విని తల్లి తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాడగ జూచినారు ఢి
ల్లీ నగరాంగ్ల భారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానగ గాంచి " అగ్బ" రమరాలయ మేగె వెలుంగుచుక్కయై.

శా. ఎన్నో బాధలు బొందుచుండు మని న న్నీ భూమివర్జించి యా
పున్నెపుంగని అగ్బరేగె దివికిన్ బూర్ణేందు బింబంబు వా
ర్ధి న్నిద్రింపగ బోయినట్లిక మహాంధీభూత మాలిన్యం సం
ఛన్మాస్మన్వి నిషిద్ధజీవిత మభావం బెన్ని నాళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాడగా లేదు
పరమ సాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసి
పరమ హర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ

ఏవురు కొడుకుల నిద్దరు కూతుల
నవిశంబు దీవించు నాత్మ శాంతి.

తే. ప్రతిదినంబును చదువు ఖురాన్న మాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్ర
రాంబ దివిజులు నీరాజనంబులిడగ.

చ. పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికి బారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థన సేయును నెల్లవేళలన్

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లీలో బ్రిటిషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
పుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లన్ విచ్చిన కుండబోలె వెస నే జీరాడుచున్నా నిటన్

చ. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచు గన్నులనీరు కాల్వలై
చెదరంగ నిమ్న లోకముల జేరుటకంటె సమాధితొంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెప్ప యైహి కా
స్పద విభవానుషంగ భవబంధమువాసిన నిన్ను చూడగన్.

శ్రీ కవిగారు యిస్లాం మతస్థులు, వీరి మాతృభాష ఉర్దూ, ఆంధ్రభాష మాతృభాషగా కానివారు తెనుగున సరస కవిత్వము జెప్పినవారు ఈ కవిగారొక్కరే. వీరు రచించిన ''మహాభారత కౌరవరంగ'' మను నాటకమున.

''నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భావవీధుల విహార మొనర్చి జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుతు ఉమర్ఆలీషా కవీంద్రుడన్''
అని వ్రాసిరి.

శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి ఈ తత్వ కీర్తనలందు కూడ అనేక గంభీర భావముల నొసంగిరి.

"చంద్రుడెవరు చుక్కలెవరు
ఇంద్రుడెవరు ఈశుడెవరు
ఇంద్రియంబులు కట్టిచూచితే
యిన్నితానై యుండలేద"
....    ....    ....
" రాయినైతే రప్పనైతే
కాయనైతే కసరునైతే
ఏ యుపాయముచేతనో నే
నా యనంతుని బట్టియుందు"

మున్నగు పెక్కు ఋషివాక్యము లీ కీర్తనలందు చెప్పిరి. వీరు రచించిన "సూఫీవేదాంత" గ్రంథములో

మ. "కనదుత్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబు గావించు న
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్ర
హ్మనుగామార్చెడు త్రోవజూపితి నిధిధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరిసంకాశంబు సంధిల్లెడున్.
'అని చెప్పిరి.

బ్రహ్మఋషి సత్తములైన శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి జీవితమును చరిచి అనేక తత్వగ్రంథములను వ్రాసి అజ్ఞానాంధకారమున నల్లాడు జీవునిబ్రహ్మనుగా మార్చెడు త్రోవజూపిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమ గోదావరి జిల్లా) వెళ్ళి అచ్చట ది. 23 జనవరి 1945 నాటి సాయంత్రము 5 గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతికదేహమును పిఠాపురము దెచ్చి 24 వ తేది సాయంత్రము రైలుస్టేషను వద్దనున్న వారి యారామములో సమాధి చేసిరి.





శ్రీ అనుపోజు వెంకటరావు గారు, శ్రీమతి బుల్లమ్మాయి గారు.

తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం తాలూకా యిసుకపల్లి గ్రామ కాపురస్తులు పుణ్యదంపతులు శ్రీ అనుపోజు వెంకట రావుగారు వీరి ధర్మపత్ని బుల్లమ్మాయిగారు, శ్రీ అనుపోజు వెంకటరావుగారు, అనుపోజు వెంకటరత్నం, సుబ్బయ్యమ్మగార్ల ప్రథమ పుత్రుడుగా జన్మించినారు. అనుపోజు వెంకటరావుగారు 16వ సం॥లో షష్ఠమ పీఠాధిపతి అయిన "బ్రహ్మర్షి" డా॥ ఉమర్‌ఆలీషాగారి వద్ద మహామంత్రోపదేశము పొందినారు. వీరి ధర్మపత్ని బుల్లమ్మాయిగారు సప్తమ పీఠాధిపతి అయిన "బ్రహ్మర్షి" శ్రీ హుస్సేన్‌షా సద్గురువర్యులు వద్ద మహామంత్రోపదేశం పొంది ధన్యులైనారు.

శ్రీ అనుపోజు వెంకటరావుగారు అష్టమ పీఠాధిపతి "బ్రహ్మర్షి" శ్రీ మొహియద్దీన్ బాద్షా సద్గురువర్యులతో కలసి ఆధ్యాత్మిక ప్రచార నిమిత్తం తిరిగినారు. అన్ని సభలలో పాల్గొని స్వామిసేవ చేసుకొనేవారు.

శ్రీ అనుపోజు వెంకటరావు గారి సంతానం నలుగురు, ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు. వెంకటరావుగారి పిల్లలు, మనుమలు, మునిమనుమలు అందరు స్వామి ధర్మములోనే ఉన్నారు. అనుపోజు వెంకటరావుగారు 1989వ సం॥లో స్వర్గస్తులైనారు. వీరిధర్మపత్ని1994వ సం॥లో స్వర్గస్తులైనారు. వీరి సంస్మరణార్థం వెంకటరావుగారి కుటుంబ సభ్యులు ఈ పుస్తకమును ప్రచురించిరి.

శ్రీమదఖైలలీషా గురుభ్యోన్నమః

శ్రీ కలికాయనమః

# బ్రహ్మవిద్యా విలాసము

శ్రీశుభాకార మహనీయ సేవ్య దివ్య
భవ్య కళ్యాణగుణకరు ణావ్యయుండ
వాదిదేవుండ వఖిలలో కై కుడీవే
కలుషగత వేషభూషయా ఖైలలీష. 1

తే॥గీ॥ అవధరింపుము బ్రహ్మజీ వాత్మజగము
నీశ్వరాకాశమాయల నిర్ణయించు
శతకరత్నంబురచియింతు శ్రద్ధతోడ
కలుషగతవేషభూషయా ఖైలలీష 2

## బ్రహ్మ నిర్ణయము

తే॥గీ॥ నిశ్చలంబయిఒక్కటై నిత్య సత్య
నిష్కళానందనిష్క్రియ నిర్గుణంబు
యైన బ్రహ్మంబహంబని యలరుమున్ను
కలుషగతవేషభూషయా ఖైలలీష. 3

## మాయోత్పత్తి

తే॥గీ॥ ఆపరబ్రహ్మమందున నప్రయత్న
మైనమాయజనించినయ్యదియేబ్రహ్మ
మందుగూడుచుచైతన్య మగుచుదోచె
కలుషగతవేషభూషయా ఖైలలీష. 4

తే॥గీ॥ అపుడు మాయాప్రధాన బ్రహ్మంబునందు
నామరూపాదివ్యవహార నైజగుణము
భూతకార్యంబుగల్పించి బొదలుచుండె
కలుషగతవేషయా . . . 5

తే॥గీ॥ మాయయనియుయవిద్యని బ్రహ్మమందు
నుండుశక్తి బేళ్ళగు చుండుజూవె
ప్రణవనాదకళాతీత ప్రకృతిభూత
కలుషగతవేషయా . . . 6

## సగుణ నిర్గుణ బ్రహ్మనిరూపణ

తే॥గీ॥ మాయకుప్రతిబింబించిన మాయచేత
నంబు మాయకు నాధార మైనబ్రహ్మ
చేతనముమాయగూడి విచిత్రముగను
సగుణబ్రహ్మంబుయైజగం బగుచునిలచె 7

తే॥గీ॥ సగుణ బ్రహ్మంబనంగను సహజమైన
నీశ్వరుండనగాజెల్లు నిట్లురెండు
జెప్పవచ్చును శృత్యర్థ మొప్పుకొనుచు
కలుషగతవేషయా . . . 8

తే॥గీ॥ ఆయవిద్యయును నవిద్య యందు ప్రతిభ
లించిన చిదాభాసుండు నింక నాయ
విద్యకా ధారకూటస్థ వేద్యబ్రహ్మ
కలుషగతవేషయా . . . 9

తే॥గీ॥ శుద్ధసత్వప్రధానంబు జూడమాయ
గనుక బ్రహ్మంబునందునా కాశనామ
రూపజగములేసి యెరుంగదయ్యె
కలుషగతవేషయా . . . 10

తే॥గీ॥ మాయసర్వమెరుంగు ధర్మంబులుగల
యీశ్వరుని జీవునివలె మోహింపజేయ
లేకపోయెను యోగి సుశ్లోకవినుత
కలుషగతవేషయా . . . 11

తే॥గీ॥ ఘనవిద్యయె మోహల క్షణస్వరూప
మైనదగుటచేతను చిదా భాసునకును
మోహమునద్రోచి విపరీతముగనుబరగు
కలుషగతవేషయా . . . 12

తే॥గీ॥ స్వస్వరూప భూతుండునీ శ్వరుడుతాను
తానె కూటస్థుడనజెల్లు వానిమోహ
సాగరంబున బడద్రోచు యోగమూర్తి
కలుషగతవేషయా . . . 13

తే॥గీ॥ అ తతోంబదియారింద్రి యాదులందు
ప వికారా దివ్యవహారముల వసించి
నేమనుష్యుండననిబల్కు నెరుకలేక
కలుషగ్గతవేషయా . . . 14

## తొంబదియారింద్రియ విచార ఘట్టము

తే॥గీ॥ బ్రహ్మవాదులు. కొందరు వాదమందు
బలుకునిరువది నాల్గు తత్వంబులనుచు
నందుకొందరు ముప్పది నాల్గయనుచు
కలుషగతవేషయా . . . 15

తే॥గీ॥ సాంఖ్యమున బ్రహ్మవాదులు శాంతమొంది
దలచు తొంబదియారు తత్వంబులనుచు
గాన వివరింతునన్నియు క్రమముగాను
కలుషగతవేషయా . . . 16

తే॥గీ॥ చెవులు చర్మంబు ముక్కును జిహ్వ నేత్ర
వాక్కు చేతులు కాళ్ళును పాయువస్థ
లనుదశేంద్రియములనెల్ల గనుమునిట్లు
కలుషగతవేషయా . . . 17

తే॥గీ॥ ప్రాణ వ్యాన సమాన యపానుదాన
శబ్దరసగంధరూప స్పర్శంబుల నెడు
ప్రాణపంచకము విషయ పంచకములు
కలుషగతవేషయా . . . 18

తే॥గీ॥ బుద్ధిచిత్తంబ హంకార మును మనస్సు
సహితనంతఃకరణ చతు ష్టయము నివి య
పైని నిరువది నాల్గు తత్వంబులయ్యె
కలుషగతవేషయా . . . 19

తే॥గీ॥ భూమిజలమగ్ని ఖంవాయు భూతపంచ
కంబుస్థూలసూక్ష్మముకా రంబు స్వప్న
జాగ్రత సుషుప్తి యజ్ఞాన జాతములును
కలుషగత వేషభూషయా ఖైలలీష. 20

తే॥గీ॥ ఇట్టి పంద్రెండు తత్వంబు లీవిధంబు
పై చతుర్వింశతీతత్వ వ్రజముగలిపి
వరుస ముప్పదియారుత త్వంబులైయ్యె
కలుషగతవేషయా . . . 21

తే॥గీ॥ వున్నదియు పుట్టుటయు వృద్ధినొందుటయును
మారుచుండుట క్షయమౌట పాడుయౌట
యనెడు షడ్భావ వికృతంబులనగ నివియె
కలుషగతవేషయా . . . 22

తే॥గీ॥ ఆకలియుదప్పి మోహంబు శోక ముదిమి
చావులను షడూర్ములునివి సత్యముగను
నఖిలమునిజన గమన సన్యాసవిమత
కలుషగతవేషయా . . . 23

తే॥గీ॥ ఎముకలను రక్తమాంసంబు యెముకచమురు
క్రొవ్వు చర్మంబులనెడు షట్కోశములివె
యోగనిద్రావిచారవిరాగులనిరి
కలుషగతవేషయా . . . 24

తే॥గీ॥ ముదము మోహంబు లోభంబు మత్సరంబు
క్రోధకామంబులను గురు బోధనలన
వైరిషడ్వర్గమనబడు భక్తవరద
కలుషగతవేషయా . . . 25

తే॥గీ॥ ప్రాజ్ఞతైసజసవిశ్వజీ వత్రయంబు
సత్వ రాజస తామస సగుణత్రయము
సంచితాగామి ప్రారబ్ధ సంచయంబు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 26

తే॥గీ॥ చెప్పుట గ్రహించుట నడుట నొప్పుగాను
మలవిసర్జన యానంద ములునుగూడి
కర్మవ్యాపారమునుపంచ కంబుయయ్యె
కలుషగతవేషయా . . . 27

తే॥గీ॥ నిశ్చయించుట సంకల్ప నికరములును
ధారణంబును యభిమాన తత్వములును
కరుణసంతోషమునుపుపే క్షయునుమైత్రి
కలుషగతవేషయా . . . 28

తే॥గీ॥ వాయువును దిక్కుయినచంద్ర వరుణుడింద్రు
డశ్వినీదేవతలు మృత్యు వగ్ని బ్రహ్మ
దేవుడీశ్వరువేంద్రులు జీవరుద్రులు
కలుషగతవేషయా . . . 29

తే॥గీ॥ తనరుపదునాల్గురధిదేవ తలును పైని
నలుబదారును ముప్పది నాల్గుగూడి
పరగ తొంబదియారు త త్వంబులయ్యె
కలుషగతవేషయా . . . 30

తే॥గీ॥ పరగుతొంబదియారు తత్వంబులకును
వేరుగాయున్న తత్వమెవ్వరు యెరుంగు
దేవదేవుండు గురుడుయై దెలుపకున్న
కలుషగతవేషయా . . . 31

తే॥గీ॥ అట్టి తత్వంబుగని ప్రత్యగాత్మగా భా
సించుపురుషుండు మరిజన్మ జీవకర్మ
లొందనేరడు మోక్షంబు నొందగలడు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 32

తే॥గీ॥ అఖిలతత్వంబు లెరిగి సన్యాసియైన
యోగియై యా శ్రమారణ్య మేగియైన
ముక్తినొందును సంసారమునను నున్న
కలుషగతవేషయా . . . 33

తే॥గీ॥ ఎవడు కూటస్తబ్రహ్మంబు నేనుయనుచు
యెరిగి జీవత్వమును బాసి యేకమగుచు
నుండునతడె జీవన్ముక్తి నొందగలడు
కలుషగతవేషయా . . . 34

## ఆత్మ స్వరూప విచారము

తే॥గీ॥ హానియే దేహమందున గానిలేదు
నేను యెప్పటికీలాగు గానెయుందు
ననుచు యూహించువాడు నా త్మనగజూవె
కలుషగతవేషయా . . . 35

తే॥గీ॥ ఎట్లు క్షేత్రజ్ఞుడే పరమేశ్వరుండు
యగును యనుచు శంకింప దగదు మాయ
క్రమ్మియుండుటచేతను గాన బడదు
కలుషగతవేషయా . . . 36

తే॥గీ॥ నేను వెలిగెడువాడను గామయనెడు
దెలివి మాలినవాక్యంబు దెలివిచేత
దెలియబడుచుండు తన కెట్లు దెలివిలేదు
కలుషగతవేషభూషయా ఖైలలీష 37

తే॥గీ॥ స్వప్రకాశుండు విజ్ఞాన సత్యనిత్యు
డగుచు నాధారసూన్యుడు యైనయాత్మ
స్వాత్మభావంబుచే పరమాత్మయగును
కలుషగతవేషయా . . . 38

తే॥గీ॥ నాకువ్యతిరేకమైయున్న లోకములును
నీశ్వరాకాశ జీవులు లేవు లేవు
గాన వీనిని నంటని జ్ఞానినేను
కలుషగతవేషయా . . . 39

తే॥గీ॥ కాకినేత్రంబువలె జ్ఞానికర్మలందు
జ్ఞానతురియ సమాధిని జ్ఞానమందు
వనరు యిరుభాషమాట్లాడు వాని వలెను
కలుషగతవేషయా . . . 40

తే॥గీ॥ ఎరుకలేనట్టి గాడాంధ నిరయమందు
కర్మసంచితమనునూత కాలుజారి
పడినమూఢుండు యాత్మాను భవుడుయగునె
కలుషగతవేషయా . . . 41

తే॥గీ॥ అడవిలోనగ్ని లోబడి మాడువాడు
చెట్లనీడయు జల సౌఖ్యమెట్లు గాంచు
యెరుకలేదన్నముక్తి యే కరణిగాంచు
కలుషగతవేషయా . . . 42

తే॥గీ॥ పుణ్యకర్మంబుచే పాపమును నశించి
పుణ్యదేహంబు సిద్ధించు మున్నుగాని
బ్రహ్మజ్ఞానంబు లభియింప బడదుజూవె
కలుషగతవేషభూషయా ఖైలలీష. 43

తే॥గీ॥ కర్తృతంత్రంబు గలదియీ కర్మమెల్ల
వస్తుతంత్రంబు జ్ఞానంబు బగలురేయు
బ్రహ్మవస్తువిచారంబు వలయుజేయ
కలుషగతవేషయా . . . 44

తే॥గీ॥ అపుడుజ్ఞానంబు నుదయించు నడ్డులేక
దానబ్రహ్మంబు గనవచ్చు దనుకముక్తి
గలుగునిక్కంబుకరతలా మలకముగను
కలుషగతవేషయా . . . 45

తే॥గీ॥ స్థూలసూక్ష్మాదు లౌప్రపం చాళులకును
కర్మవర్ణాశ్రమాచార ధర్మరహిత
మైన కేవలయాత్మయే బ్రహ్మమగును
కలుషగతవేషయా . . . 46

తే॥గీ॥ సర్వమును బ్రహ్మమనుము యేసంశయంబు
లేకనీవునుబ్రహ్మంబె సకలమందు
ముక్తిగోరకయున్నను ముక్తిగలుగు
కలుషగతవేషయా . . . 47

## యోగ నిర్ణయము

తే॥గీ॥ పవనయింద్రియములవృత్తిని విషయముల
నుండి ద్రిప్పి మనస్సునందుంచవలెను
యామనస్సును బుద్ధియం దమరబెట్టి
కలుషగత వేషభూషయా ఖైలలీష 48

తే॥గీ॥ ఆమనోమలబుద్ధి మహత్తుతత్వ
మందుబెట్టి మహత్తత్వ మరసిప్రత్య
గాత్మయందుంచవలె యోగి క్రమముగాను
కలుషగతవేషయా . . . 49

తే॥గీ॥ అపుడు నేననుహంకార మణగిపోవు
నిశ్చలంబగు స్థూలదే హేంద్రియములు
గూడు గుణములు కళ్యాణ గుణములగుచు
కలుషగతవేషయా . . . 50

తే॥గీ॥ అగ్నిమంటలులేకుండ భగ్నమైన
నిప్పులాగున జ్ఞానిదే హేంద్రియములు
మనములోననిమిడ్చి వెల్గునుధరిత్రి
కలుషగతవేషయా . . . 51

తే॥గీ॥ పరులనాశించు స్త్రీలభావంబులెపుడు
పనులయందున్న విటునిపై బాయనట్లు
జ్ఞానియెట్లున్న చెడదు విజ్ఞానదృష్టి
కలుషగతవేషయా . . . 52

తే॥గీ॥ బరువుమోసిన పురుషుండు పరమమైత్రి
రాత్రినిద్రించి సుఖమొందు ధాత్రినట్లు
జ్ఞాని సంసారమటురోసి సౌఖ్యమొందు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 53

తే॥గీ॥ రాతిపైనీళ్ళుప్రవహించి రాత్రిబగలు
నెట్లుముక్కలుజేయదో నట్లుజ్ఞాని
బుద్ధిపై యాశబారిన బొగిలిపోదు
కలుషగతవేషయా . . . 54

తే॥గీ॥ అగ్నిలోమండుపురుషుండు యతివలందు
సుఖము శృంగారమేరీతి జూడలేడొ
నట్లుజ్ఞానియు విషయాదు లెట్లు గాంచు
కలుషగతవేషయా . . . 55

తే॥గీ॥ ఆత్మచైతన్య మాతృండు యాత్మకంటె
వేరు వస్తువులేదు యీ విశ్వమందు
యాత్మసర్వక్రియాశూన్యు డయ్యెవాడు
కలుషగతవేషయా . . . 56

తే॥గీ॥ దీపముకు వేడివెలుగులు స్థిరములైన
వెలుగెవ్యాపించి గృహమున వెలుగునట్లు
యాత్మచైతన్యమగుచు దేహమునుండు
కలుషగతవేషయా . . . 57

తే॥గీ॥ రంధ్రములు లేనియద్దంబు సాంద్రమైన
నీ ప్రపంచముఖములు గాన్పించినట్లు
బ్రహ్మమందున విపరీత ప్రకృతిదోచు
కలుషగతవేషయా . 58

తే॥గీ॥ సందియము బాసి బ్రహ్మయా నందమొంద
గోరువాడు ప్రపంచపు కోర్కెలేక
నిజసమాధిని యహమంచు నిలువలయు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 59

తే॥గీ॥ గుణములేకను సగుణనిర్గుణుడుగాక
తనకుతావందనంబిడు తత్వవిదుడు
యెపుడుశాంతుండు మరిజన్మలెత్తబోడు
కలుషగతవేషయా . . . 60

తే॥గీ॥ మొనసివేసినవిత్తులు మొలవనట్లు
తన్ను తాగాంచినట్టి విద్యావిదుండు
జన్మలెత్తడు ముక్తికి జనునతండు
కలుషగతవేషయా . . . 61

తే॥గీ॥ ఇంద్రియశరీరముల కెల్ల నితరుడౌట
ఇట్టిదట్టిదిదొయనరాని దేదిగలదొ
యట్టివాడగు పరమాత్మ నదియెనీవు
కలుషగతవేషయా . . . 62

తే॥గీ॥ ఇంద్రియజ్ఞానవిషయాల కితరుడగుచు
స్వప్రకాశుండుయై జ్ఞాన సమ్ముఖమున
గానబడుచుండ సూన్యుండు గాడుయాత్మ
కలుషగతవేషయా . . . 63

తే॥గీ॥ ఆత్మచైతన్య రూపుండు యాత్మకంటె
నన్యమెల్లనుడాద్యసా మాన్యములగు
నిందుచేతనె జడరూపు లెరుగరాత్మ
కలుషగతవేషయా . . . 64

తే॥గీ॥ వాక్కుచేతను బుద్ధిభావంబుచేత
యనుభవింపబడదుయాత్మ నహమటంచు
స్వస్వరూపంబుచింతించు వానిదప్ప
కలుషగతవేషభూషయా ఖైలలీష. 65

తే॥గీ॥ జననమరణాది సంసార జన్మకర్మ
లెపుడుగలుగవు బ్రహ్మయిక విపుల జ్ఞాను
లైనవారికి నిద్రాదులందు గాని
కలుషగతవేషయా . . . 66

తే॥గీ॥ అంతకొక్క రహస్యంబు నాలకింపు
నాత్మబ్రహ్మల రెంటిని యరయశబ్ద
మాత్రభేదంబెగాని సమానమగును
కలుషగతవేషయా . . . 67

తే॥గీ॥ నేనుయను చిదాభాసుండు నింతవరకు
యెరుగకుండుటయేయవిద్య రజమను
యాత్మలేదన్న యాపరణాంధమగును
కలుషగతవేషయా . . . 68

తే॥గీ॥ బేలలజ్జపుత్రాద్య పేక్షచేత
దుఃఖమొందును నాకట్టి దుఃఖపేక్ష
గలుకదానందపరిపూర్ణ ఘనుడ నేను
కలుషగతవేషయా . . . 69

తే॥గీ॥ అఖిలలోకస్వరూపుండ నైన నాక
పేక్షలేదెంతమాత్రంబు విశ్వమందు
కర్మములు జేయువాడనుగాను నేను
కలుషగతవేషయా . . . 70

తే॥గీ॥ మానసాది దశేంద్రియ మహదహంకృ
తులు శరీరగుణత్రయములను నెల్ల
జూచుదెలివియె చిత్కళా సూర్యుడగును
కలుషగత వేషభూషయా ఖైలలీష. 71

తే॥గీ॥ క్షేత్రమునకు విలక్షణ మాత్రయైన
నక్షరుండును క్షేత్రజ్ఞు డనగనొప్పు
వాడధోగతులకుపాలు గాడుయెపుడు
కలుషగతవేషయా . . . 72

తే॥గీ॥ నిఖలమొక వేళనీక్షించి నిర్ణయించు
క్షరము యక్షరమిదియిది స్థిరములనువి
వక్షతలుజేయునదిదెలివై వెలుంగు
కలుషగతవేషయా . . . 73

తే॥గీ॥ మొదలు రేచకపూరకములకు రెండు
హంసనాదకళాతీతు డహమటంచు
బలుకునోంకారమది దెలివైవెలుంగు
కలుషగతవేషయా . . . 74

తే॥గీ॥ జగముమాయాప్రధాన నిచ్ఛాతమంబు
వృత్తిసందేహ దేహ ప్ర వృత్తులనుచు
దెలియు దెలివియె శాశ్విత దేజమగును
కలుషగతవేషయా . . . 75

తే॥గీ॥ వెతకినీనీనామహావాక్య వాదములకు
నుపనిషద్యుక్తులను నేర్చి నుచ్చరించి
బలుకనద్వైతవ్యవహార మగునుజూవె
కలుషగతవేషయా . . . 76

తే॥గీ॥ శబ్ద మెవ్వేళ తనయందు శాంతినొందు
నపుడుగుణ దశేంద్రియములు నాగిపోవు
దెలియబడుజీవుడేనని దెలియవలయు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 77

తే॥గీ॥ ఎవ్వడెయ్యేను భగవంతు డీశ్వరుండు
నక్షరుండును కూటస్థు డతడు జీవు
డేను నేననువాడెపో నిర్మలాత్మ
కలుషగతవేషయా . . . 78

తే॥గీ॥ మున్ను నిర్గుణబ్రహ్మంబు మూలప్రకృతి
కాశ్రయంబైన మాయకు నవ్వలగుచు
వెలిగి జీవత్వమునుదాల్చి దెలివియైయ్యె
కలుషగతవేషయా . . . 79

తే॥గీ॥ ఇట్టిజీవుండు దేవుండు నీవగురువు
నీవుత్రైలోక్యపూజ్యుండ వై వెలుంగు
వాడవవ్యయుడౌదువు వసుధయందు
కలుషగతవేషయా . . . 80

తే॥గీ॥ ఎంతదాకను జీవుండు నీశ్వరుండు
గాకయుండునో నజ్ఞాన గాఢచీక
టిని మహాదుఃఖ మొందినటించి చెడును
కలుషగతవేషయా . . . 81

## మహోజ్ఞాన ధ్యాన సమాధిలక్షణము

తే॥గీ॥ ఎవ్వడాత్ముండు జీవుండు యీశ్వరుండు
హరియు బ్రహ్మంబు భగవంతు దక్షరుండు
నేను నేననిబలుకు నేననియెరుంగు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 82

తే॥గీ॥ పరగజీవుండుగానునే బ్రహ్మమగును
బాహ్యయింద్రియములుగాను బ్రహ్మమగుదు
ప్రకృతిపురుషులకంటని బ్రహ్మమగుదు
కలుషగతవేషయా . . . 83

తే॥గీ॥ ప్రాణ దేహంబులును గాను బ్రహ్మమగుదు
పాపపుణ్యాదులునులేవు బ్రహ్మమగుదు
ప్రణవ బీజాక్షరోంకార బ్రహ్మమగుదు
కలుషగతవేషయా . . . 84

తే॥గీ॥ పరమక్షేత్రజ్ఞకూటస్థ బ్రహ్మమగుదు
బహుళసంసారములులేని బ్రహ్మమగుదు
రాజయోగసమాధినే బ్రహ్మమగుదు
కలుషగతవేషయా . . . 85

తే॥గీ॥ పామరుండును గానునే బ్రహ్మమగుదు
భ్రమయు జాడ్యంబులేదు నే బ్రహ్మమగుదు
పరమవిజ్ఞానమూర్తినే బ్రహ్మమగుదు
కలుషగతవేషయా . . . 86

తే॥గీ॥ రాజసము తామసములేని బ్రహ్మమగుదు
మరణ జననంబులునులేని బ్రహ్మమగుదు
భావములకందరాని నే బ్రహ్మమగుదు
కలుషగతవేషభూషయా ఖైలలీష. 87

తే॥గీ॥ ఇట్టిజ్ఞానంబు జన్మకు నెట్టులైన
వడసి గడియింపవలె సుమీ వసుధయందు
యట్టుగానిచొ మనుజుడై పుట్టనేల
కలుషతవేషయా . . . 88

తే॥గీ॥ సత్యశాంతంబు శమదమ సాధుతనము
భూతదయ నాత్మచింతయు నీతిగలుగు
వాడు భూషింపబడు సుమీ వసుధయందు
కలుషగతవేషయా . . . 89

తే॥గీ॥ కర్మనశియించిన, నుపాధి గాలిపోయి
జ్ఞానయోగంబుసిద్ధించెనేని నీవు
స్వామిధ్యానంబు మానుట పాడిగాదు
కలుషగతవేషయా . . . 90

తే॥గీ॥ వినుము హరిభక్తి చిత్తమం దుననునిల్పి
జ్ఞానవెనుకసమాధిని గనుమునిన్ను
ప్రత్యగాత్మస్వరూప బ్రహ్మంబుగాను
కలుషగతవేషయా . . . 91

తే॥గీ॥ యెల్లవాంఛలునుడుగును యుల్లమొకటి
దీపమువలె వులుగుమూర్ఖ తిమిరమందు
నపుడు విజ్ఞానముదయించు ననఘచరిత
కలుషగతవేషయా . . . 92

తే॥గీ॥ వాంఛనుంచకదేనిపై నించుకైన
వాంఛజన్మకు మూలంబు మాయయదియె
వాంఛవిడచిన ముక్తిలభించు నిజము
కలుషగత వేషభూషయా ఖైలలీష. 93

తే॥గీ॥ సత్యశాంతంబులుండినచాలు లేక
ధ్యాన్నవైరాగ్యజ్ఞానంబు లున్నజాలు
కరుణాతృత్వములునున్న గలదుముక్తి
కలుషగతవేషయా . . . 94

తే॥గీ॥ ఏమహనీయుడనిశంబు యెరుకచేత
భగవదాధనధ్యాన వంతుడగునొ
నతడు కైవల్యమును జేరు నడ్డులేక
కలుషగతవేషయా . . . 95

తే॥గీ॥ ఎంతమాత్రంబు నేముక్తి కేగగలనొ
లేనొ యనుచును శంకింపగాను వలదు
నేనుయాత్మ స్వరూపవిజ్ఞానినౌట
కలుషగతవేషయా . . . 96

తే॥గీ॥ దేహమును బాసి నాస్వామి దేజరూప
మునుధరించియు నారూప ముననెయుందు
నేపరిచ్ఛన్నుడనుగాను నిజముజూవె
కలుషగతవేషయా . . . 97

తే॥గీ॥ నేను దేవాదిదేవుండు యైనవాని
గొల్చితద్రూపధారినై గోరివాని
దేహమందునజొచ్చి మద్దేహుడగుదు
కలుషగతవేషయా . . . 98

తే॥గీ॥ నేనుకల్పాంతకాలమందేని జ్ఞాన
భిన్నుడనుగాను నిట్లనే వెలుగువాడ
దేవునకు నాకుభేదమిం తేనిగలదె
కలుషగతవేషభూషయా ఖైలలీష. 99

తే॥గీ॥ విధినిషేధములున్నలేవు వెదుకమాకు
యనుచువాదింపదెన్నడు యాత్మవిదుడు
వాడువ్యవహారమర్యాద బాహుదౌట
కలుషగతవేషయా . . . 100

తే॥గీ॥ ఇట్టియనుభవ జ్ఞానంబు నెవ్వడెరుగు
దేవమహనీయసంసేవ్య దివ్యమూర్తి
వైననీవొక్కడవుదక్క మహితతేజ
కలుషగతవేషయా . . . 101

తే॥గీ॥ నీవుకలికమూర్తివియై యనేకదుష్ట
కష్టసంతాపముదీర్చి గావుమయ్య
నిఖిలకళ్యాణగుణములు నిచ్చిమాకు
కలుషగతవేషయా . . . 102

తే॥గీ॥ పీఠికాపురనగరంబు పేరుకెక్క
నీవువసియించి భక్తుల నేలినావు
బ్రహ్మవిద్యావిలాస సంపదలుగలుగ
కలుషగతవేషయా . . . 103

తే॥గీ॥ నీవు రామాద్యనంత కృష్ణావతార
ధారివై భక్తులను బ్రోచి దయదలంచి
యున్నమహనీయపూజ్యుండ వొక్కడవును
కలుషగతవేషయా . . . 104

గద్య ॥ ఇది శ్రీమదాఖైలలీషా గురుకరుణాకటాక్ష వీక్షణలబ్ధబ్రహ్మ
విద్యావిరాజిత మదీన్ కబీర్ గురువంశపయః పారావార
రాకాసుధాకర నిఖిలవిద్వద్వి బుధ సంస్తవ పవిత్ర మోహి
యద్దీన్ భాష్యాసద్గురు జ్యేష్ఠపుత్ర సద్గుణ చరిత్ర,
ఉమర్ఆలీషా ప్రణీతంబైన బ్రహ్మ
విద్యావిలాసము సర్వమును

సంపూర్ణము.



## శ్రీ ఉమర్ ఆలీషా గ్రంథమండలి

### పిఠాపురం - 533 450

1. శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2. దానవవధ
3. మహాభారత కౌరవ రంగము (నాటకం)
4. సూఫీ వేదాంతదర్శము
5. అనసూయ (నాటకం)
6. కళ
7. ప్రభాత కథావళి (కథలు)
8. విషాద సౌందర్యము
9. విచిత్ర బిల్హణీయము
10. బ్రహ్మ విద్యావిలాసము
11. స్వర్గమాత (కందార్థములు)
12. తత్వసందేశము
13. పరతత్వ కీర్తనలు
14. చంద్రగుప్త (నాటకం)
15. ఉమర్ ఖయ్యామ్
16. మణిమాల (నాటకం)
17. శాంత
18. ఖండకావ్యములు
19. బర్హిణీదేవి
20. పద్మావతి (నవల)
21. సాధనపదము
22. షాతత్వము (బ్రహ్మర్షి హుసేన్ షా సద్గురువర్యులు)
23. తత్వప్రబోధము (బ్రహ్మర్షి మొహిద్దీన్ బాదుషా)
24. తత్త్వజ్ఞానము మాస పత్రిక